కేవిషయంబుఁజూచినను నెంతయు రోఁతగఁ గానుపించు సు
శ్రీవిలసిల్లఁగాఁదగిన శ్రేయముఁ గూర్పుము జానకీపతీ! 88

చ పరధనముల్ హరించి పరభామలఁ గోరుచు ధర్మమార్గముల్
మఱచి ధరం జరించు మదమత్తునకున్ సమవర్తి యెట్టి దు
ర్భరమగుశిక్ష వేసెడినొ భ్రాంతత నాకది వేయనీక నీ
కరుణకుఁ బాత్రుఁజేసికొను కాళుఁ వ్రాలితి జానకీపతీ! 89

చ ధరఁగల తీర్థకోటులకుఁ దానకమై విలసిల్లు నీపదాం
బురుహము లాశ్రయించితిని పూజయొనర్చితి నీకు సత్కృపన్
బొరసినఁగాని కాను గడుఁబుణ్యుఁడ నింక ననుగ్రహింపుమో
యరుణగభస్తిసంతతి మహాబ్ధినిశాపతి! జానకీపతీ! 90

చ కలతను బొందఁగాఁదగినకాలము నెప్డు ఘటింపఁబోకుమా
మెలఁకువతోడ నిన్నెపుడు మేమరభక్తి భజించుచుందు నా
నెలత కనామయంబొసఁగి నిచ్చలు నాయెడ లుడ్పి ప్రోవుమా
చలనములేని సౌఖ్యమును జక్కఁగఁ గూర్చుచు జానకీపతీ! 91

ఉ అన్నవ నీవు పూర్వభవమందున నోఁచిన నోము గాన నీ
కెన్నటికైన సౌఖ్యమువహించెడు భాగ్య మదెట్లుగల్గు నం
చెన్నఁగరానికష్టముల నెప్డు ఘటించుచు దుఃఖవార్ధిలో
నన్నిటుముంపఁ బాడియగునా? వచియింపుము జానకీపతీ! 92

చ అలసి శ్రమంబుతో నతిథి యాత్మగృహంబున కేగుదెంచినన్
కలిగినమాత్ర మన్న ముదకంబు నొసంగక సేదదీర్చి నా
ఇలు సొరనీక యేమిటికి నీడకు వచ్చితివంచుఁ గ్రూరతన్
చలమునఁ బల్కియుంటినొకొ నన్గరుణింపవు జానకీపతీ! 93

ఉ స్రుక్కుచునుంటి కంఠమును శోషిలె ధైర్యములేదు నెమ్మదిన్
బొక్కుచునుంటి దీనుఁడను బోష్యపువర్గములోనివాఁడ నా
చిక్కులుదీర్చి హర్షమును జెందఁగఁజేసి యనుగ్రహించి నీ
ప్రక్కకుఁజేర్పరాదె? యనురాగము మీఱఁగ జానకీపతీ! 94

# పితృపాద సంస్మృతి

—— o ——

శా॥ వేదమ్ముల్ పఠియించి సాంగముగ స
ద్విజ్ఞానలక్ష్మీకలా
మోదాత్ముండయి మించె నెవ్వఁడు యశ
మ్మున్ నించి నల్దిక్కులన్
శ్రీదుండే నల రామనాథు జనకున్
సేవింతు సద్భక్తి నీ
పాదమ్ముల్ రఘురామ పాహియని సం
ప్రార్థించుచున్ రాఘవా !

వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు

# పీ రి క

రసికులారా !

సహజమగు తన కలమంజులస్వరమున భావమనోజ్ఞమంగళగీత ములుపాడు నీకవికలకంఠపోతము శ్రీ సుకవితాసామ్రాజ్యము నేక చ్ఛత్రముగ నేలిన శ్రీ తిరుపతివెంకటేశ్వరుల కరుణాకటాక్షసుధా రసము గ్రోలుచుఁ దత్ప్రభావమున రచించిన కబ్బములు పెక్కుఁ గలవు అందు నీజానకీపతిశతక మొకటి - ఇది కేవలము భక్తిరస పరిపూరితమై లలితంపు శయ్య నలరారుచు నీతిరత్నముల కెల్లఁ బేటిక యై చెలువొందుచున్నది ఇందు శ్రీరాముని త్యాగశీలతయుఁ గుల సమాగత ధర్మగుణరక్షణమును జానకీవిమలపాతివ్రత్యమును లక్ష్మణుని సౌభ్రాతృత్వమును భరతుని నిష్కలంకమహాత్యాగమును భక్తిరసా వేశమున వర్ణింపఁబడినవి ఈకవి తన తాతతండ్రులువోలె రామభక్తి పరాయణుండని తద్గ్రంథమే చెప్పక చెప్పెడిని

## గు ణ సం ప త్తి

సత్వగుణసంపన్నతను బితాజ్ఞాపరిపాలనంబునను ధర్మరక్షణ మ్మునను శ్రీరాముఁడువోలె ముందంజవైచు త్యాగధనులలో నీ యువకుఁ డొకఁడని యీతని జీవితచారిత్రమును గాంచిన సత్యశీలుర కెల్లఁ దెల్లము కాక మానదు

## గ్రంథప్రయోజనము

శ్రీరాముని చారిత్రమును బెక్కురు కవిపుంగవులు కావ్య నాటకశతకరూపముల రచించియుండ నిప్పుడీ

## గ్రంథమువలని ప్రయోజన మేమి ?

అట్లు నిరసింపవలదు మోక్షసాధనములలో భక్తియే ప్రథమ సాధనమని వ్యాసాదు లుద్ఘోషించుటంజేసి భక్తిరసపూర్ణమగు నీ శతకము ముముక్షుజనుల కెల్ల మార్గదర్శకమై భక్తినిఁ బెంపొందించె డిని మఱియు,

మ॥ రాఘవే
శ్వరుచారిత్రము నెవ్వ రెన్నగఁ దుల్గ వాకు ప్రచ్ఛినఁగాప్రిల దే ?

అను నార్యోక్తు లభిన దనీయములు - కలిగినదానఁ దృష్టి వడఁగల్గి క్షమాసత్యములు నుపాసించుచుఁ బరమేశ్వరప్రతిపాదకమగు కవిత్వమును రచించుచు దాన జీవితము గృతార్థత గావించుకొనుట పండితప్రశంసనీయము

గు ణ దో ష ము లు

ఇందు శైలి మధురముగ నున్నది వినువారి వీనుల నమృతంపు సోన గాలుకురీతిఁ దేటతెల్లమగు మాటలతో భావము విశదీకరింపఁ బడినది వేయేల కవితాప్రపంచమున కీకవి వర్ధమానచంద్రుఁడు మఱియు నిందు 'చేతును తోృతువె' ఇత్యాదిప్రయోగము లసాధువు లని కొందఱిమతము అందందుఁ బునరుక్తములు క్వాచిత్కము లగుచు న్నను నయ్యవి భక్తిరసతన్మయతను వ్యక్తపఱచుటంజేసి శతకమునకు నూతనాలంకృతులయి సత్కవిజనాదరణీయము లగుచున్నవి

అ భి న ం ద న ము

విద్యాభిమానియగు సీతనికి శ్రీ రాజా సురభి లక్ష్మారాయ మిడిల్‌స్కూలునందునఁ బ్రధానోపాధ్యాయత్వపద మొసంగి గృహా రామాదుల నిచ్చి దయ నాదరించుచుండిన శ్రీ శ్రితజనకల్పవల్లియగు శ్రీ జటప్రోల్ మహారాణి శ్రీ వేంకటరత్నమాంబాజననీమతల్లికిని శ్రీ తత్కుమారరత్నములగు శ్రీ రాజా జగన్నాధరావుబహాదర్ వారికిని నా జగన్నాథుఁడు చిరాయుష్యమును స్థిరసామ్రాజ్యలక్ష్మీవిభవంబు నొసంగి రక్షించుఁగాక

మఱియు, స్నేహలతా వితానసంఘమునకు నధ్యక్షుఁడయి స ద్గ్రంధరచనకుఁ గడంగుచుండిన యీతని యుద్యమమునకుఁ బరమేశ్వ రుఁడు తోడగుఁగాక

## —♦ ఆశీర్వచనము ♦—

మ. గురు నాజ్ఞం దలఁదాల్చి ధీమణులకున్ గోవిందుఁ డానందమున్
స్థిరసౌఖ్యమ్ముఁ జిరాయువున్ విజయలక్ష్మిన్ గూర్చి పాలించు-నా
పరమాత్ముండగు రాఘవేశ్వరుని దివ్యంబైన చారిత్రమే
వరలుం దత్పరమార్థలక్ష్యముగ నోవత్సా! శుభం బయ్యెడిన్ 1

మ. రఘురామున్ భజియించుచుంటివికదా! రక్షించు నిన్నాతఁడున్
రఘువంశమ్మున కాదియైన రవియున్ రక్షింపఁడే నీసతిన్
లయికిం జెందుదురే? రఘుప్రముఖు లౌరా! భక్తసంత్రాణల
ఘుదోద్యద్రమణీయకంకణలసత్ప్రాంచత్కరాంభోరుహుల్ 2

మ. చిరసౌభాగ్యముగల్గి నీసుదతి వాసింగాంచి నీపుత్రులున్
స్థిరసంపత్కమనీయవైభవయశశ్శ్రీమత్తచే నీవున్
ధర వర్ధిల్లుఁడు నూఱువత్సరము లుద్యద్రమ్యహార్మ్యాది భ
ర్మ్యరమామందిరచంద్రశాలల శుభప్రాచుర్య మేపారఁగన్ 3

ఉ. రాఁగల పెద్దియున్ మనకు రాఁగలదంచుఁ దలంచుచున్ మహా
భాగులు యోగులున్ నడచు భవ్యపథమ్మును బట్టుటల్ మహా
త్యాగులలక్షణంబని యెదం దలపోయుచు ధర్మరక్షణో
ద్యోగుఁడవై మనంగదవె విశ్రుతకీర్తిని దానసంపదన్ 4

మ. స్తుతిపాత్రింబగుఁగాక నీచంత-మాశుం డాయురారోగ్యసం
యుతఁగాఁజేసి భవత్సతిన్ మనుచుఁగా కుద్యత్కృపాదృష్టినై-
సతతమ్మున్ హితబంధువర్గమున కుత్సాహమ్ము దీపింపఁగా
మతిమచ్ఛేఖర! నీకవిత్వము జగన్మాన్యత్వముం జెందుతన్ 5

ఇట్లు,

పిఠాపురము, 29—2—32

జయంతి రామనాథ శాస్త్రి,
విద్యార్థి



మ॥ రా॥ శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారు రచించిన జానకీపతిశతకమునందలి కొన్నిపద్యముల నవలోకంచితి ఈశబ్బము భక్తిప్రధానమని చెప్పనొప్పెడిని కవిత్వము ప్రసాదగుణమున నలరారెడిని వృత్తి యుపనాగరికాప్రచురమనఁ జెల్లును అలంకారము లటనట శ్రోతల మనముల నాహ్లాదము నుప్పతిల్లంజేసెడిని

శ్రీ రామసుబ్బారాయఁడుగారు మఱికొన్ని శతకముల రచించిరి అయ్యవియు సందర్భానుగుణముగ భావపోషణముం జేయుటలో మిన్నలై మన్నన గనుచున్నయవి

ఇదియునుంగాక వీరేర్పఱచిన స్నేహలతాకవితాసంఘమునాఁ బిలువంబడు కవిసమాజమువారు రచించిన కబ్బములును యుక్తములుగఁ జూపట్టెడిని ఇట్టికావ్యముల వ్రాసియు మఱియు వ్రాయించియుఁ గాలక్షేపమొనర్చెడు శ్రీ రామసుబ్బారాయఁడుగారి కాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి భగవానుఁడు చిరకాలము రక్షించుఁగాత

వాజపేయవంశవార్ధిచంద్రిమ ! రామ
సుబ్బరాయ ! నీదు కబ్బమందు
పద్యసముదయంబుఁ బరికించినాఁడఁ బో
సంతసించినాఁడ స్వాంతమునను ॥

శ్రీధర పరశురామశాస్త్రి

## TESTIMONIAL by
## Sree Raja Inuganty Venkata Krishna Rao Bahadur Varu

Mr V Ramasubbarayudu garu B A of Kovvur is very well known to me for the last five years both as a Palace Tutor and Head master of the local middle school of Jatprole state He is an industrious and deligent young man with an excellent character Inspite of his many sided interests his field of specialisation lies in Vernacular and Sanskrit and he cultivated his Vernacular to such an extent that it is amazing while at the same time discharging hi duties as the Headmaster of the Middle School and tutor in the palace side by side in a way which won for him the good will and esteem of his pupils and superiors It is only on account of him that the Middle School at Kollapuram (Jatprole State) has come to such a good state as is at present and I am confident that he would loose no time ere long to make still bettei u e of his extraordinary talents in that direction His general character leaves nothing to be desired and in his case intelligence is combined with conscientiou ness I wish him every success in life

**(Sd) I V KRISTNARAO**
*Zamindar of Tirupacchur*

KOLLAPURAM
1st Septembei 32

---

ఈ వాజపేయయాజుల రామసుబ్బారాయుడుగారు ప్రధానముగా నభ్యసించిన భాష యింగ్లీషు అందు బి ఏ ప్యాసుచేసినారు కాని మొదటినుండియు మాతృభాషయగు నాంధ్రభాషయం దీయన కభిమాన మెక్కుడు అక్కటతన మాయెడల నెక్కుడు ప్రేమతో మా గ్రంథములను జదివి పాండితిని సంపాదించుకొన్న మా యేకలవ్య శిష్యులలో నగ్రగణ్యుడు ఈయన మామొగమును జూడకమునుపే కవియై మంచి పాండితి నాంధ్రమునందు సంపాదించినవాడయ్యె నిటీవల యల్ టి పరీక్షార్థము రాజమండ్రిలో నున్న దినములలో నవకాశమైనప్పుడెల్ల సమీపముననున్న మాగ్రామమునకు వచ్చి నా

యొద్ద భాషావ్యాసంగము గూడఁ జేసి మఱికొంత పాండిత్యమును సంపాదించుకొన్నాఁడు ఈకారణమున మా కీయన సాక్షాచ్ఛిష్యుఁడుకూడ నై యున్నాఁడు ఇప్పుడు చక్కఁగాఁ గవిత్వమును రచియించుచున్నాఁడు పాండిత్య మటుండ నిట్టియోగ్యతకల మానిసి మాట నాటఁ గాని సాధారణముగాఁ దటస్థపడని నా నిశ్చితాభిప్రాయము ఇట్టివాఁ డుపాధ్యాయుఁడగుట విద్యార్థుల భాగ్యమని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు ఈయన భగవద్గీతా పరీక్షకూడ మొదటితరగతిగా నిచ్చియుండెను వర్తనమునకును గీతావ్యాసంగమునకును సంబంధము కలదని చూచినవారెల్ల నిశ్చయింపఁగలరు

కడియము
తూర్పుగోదావరిజిల్లా

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని

చిరంజీవి వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారిని జిరకాలమునుండి నే నెఱుంగుదును చిన్ననాఁటనుండియు నతఁడు బుద్ధిమంతుఁడై యాంగ్లేయ భాషాభ్యాసముచేసి పట్టపరీక్షయందుఁ గృతార్థుఁడయ్యె నంతతోఁ దనివినందక యీనాఁటి యాంగ్లేయవిద్యాప్రవీణు లగుయువకులవలె మాతృభాష నిరసింపక దానియందుఁ దగిన కృషిచేసి పాండిత్య మలవఱచుకొని శ్రీ రాజా సురభి వేంకటలక్ష్మారావుబహద్దరువారి జీవితము, ఆరోగ్యవేంకటేశ్వర రాజరాజేశ్వరీశతకములు శనిస్తోత్రము మొదలగు గ్రంథములను రచియించెను ఈయన నేర్చినవిద్యకు వినయము వన్నె వెట్టుచున్నది విద్యావినయములకు సత్ప్రవర్తనము మెఱుఁగువెట్టుచున్నది గుణసంపన్నుఁడైన యీ యువకునకుఁ బరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యములు ప్రసాదించుఁగాత

రాజమహేంద్రవరము

చిలకమర్తి లక్ష్మీనరసింహము

బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారిచే రచింపఁబడిన యీ జానకీపతిశతకము ధారాశుద్ధిగలిగి మృదుమధుర పదగుంభితమై యలరారుచు రామభక్తు లత్యంతాభిలాషతోఁ జదువు కొనుటకు యోగ్యముగా నుండెననుటకు సందియములేదు శతకము చేతఁబట్టి యొకటిరెండుపద్యములు పఠించిన భక్తులును రసికులును శతక మంతయుఁ జదువకుండ వదలిపెట్టఁజాలరని తన్మాధుర్యము తఱచుగా ననుభవించిన నాయభిప్రాయము అక్కతంబుననే యభినవ సరస్వతియం దిద్దానిఁ బ్రచురించితిని ప్రతిపద్యమును బ్రత్యక్షరమును బలుమాఱులు పఠించియుఁ బరిశీలించియుఁ బ్రత్యంతరము లిఖంచియు నున్న కారణమునఁ బ్రకృత మీశతకమున దోషలవమును నుండదని నేను దృఢముగాఁ జెప్పఁగలను ఉపమోత్ప్రేక్షా ద్యర్థాలంకారములు గాని వృత్త్యనుప్రాసాది శబ్దాలంకారములుగాని విశేషించి కలిగి యంత ప్రౌఢము గాకున్నను మనోహరమైన ధార గలిగి సులభశైలి తోఁ బాఠకులకు భక్తిజనకమై యున్నదనుటకు సంశయము లేదు గ్రంథకర్తయగు రామసుబ్బారాయఁడుగారు సుజనులు భగవద్భ క్తులు పండితపక్షపాతులు కవితాలోలురు ఇంకను నిత్యా ద్యనేక సుగుణగణవిశిష్టులు ఇంగ్లిషులో బియేలు ఆత్మాభ్యస్తమగు నాం ధ్రాంగ్లేయభాషలలో ననేకులకు గురువులు అందుచు (శ్రీ) జటిప్రోలు సంస్థానాధిపతులగు ప్రస్తుత కుమారరాజాగారి కాంగ్లోపాధ్యాయులై వర్తమానమునఁ దత్సంస్థానమును బాలించుచున్న వారి పాలకమాత యగు రాణి వెంకటరత్నమాంబగారి యధికాదరణమునకుఁ బాత్రులు రామసుబ్బారాయఁడుగారు పైయంశము లన్నియు నీశతకమున స్ఫురిం చునట్లు వ్రాసియే యున్నవారు కావున నియ్యది ప్రశంసాపాత్రమైన శతకమని యస్మదాశయము

జానపాటి పట్టాభిరామశాస్త్రి,
అభినవసరస్వతీసంపాదకుఁడు

## —* కృతజ్ఞత *—

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంధకర్తలును శతావధానధనులును నభినవసరస్వతీ పత్రికాధిపతులును సనాతన ధర్మనిత్సారులును నగు బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు శ్రీ జటప్రోలు సంస్థానములోఁ జేరిన కొల్లాపురగ్రామము వచ్చినప్పుడు నా భాగ్యవశమున నాయింటనే నివసించిరి ఇట్టి మహనీయులను దర్శించుట కదియే నాకుఁ బ్రథమభాగ్యము నాకు నాంధ్రకవిత్వమునం దొకింత యభిరుచి యుండుటంజేసి శాస్త్రిగారివద్దఁ గొన్ని కవితా రహస్యములను సంగ్రహించితిని నాచే రచింపఁబడిన శనిస్తోత్రనక్షత్రమాలను సంస్కరించి తగు పీఠికవ్రాసి నన్నుఁ గృతకృత్యునిజేసిన మహాత్ములు వీరే నా ప్రియశిష్యురాలగు శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారిచే రచింపఁబడిన 'సరస్వతీరామాయణము'నకు సదభిప్రాయమిచ్చిన పుణ్యాత్ములును వీరే నాఁటినుండి నా 'స్నేహలతాకవితా సంఘము' నకును వీరికిని దగుబాంధవ్య మేర్పడినది సంఘ సభ్యు లందఱును వీరి నుతభక్తితో సత్కరించి నాఁటినుండి వీరిని బెద్దఁజేసి యొకగురునిగ భజించుచున్నారు ఇప్పుడు నా యీ జానకీపతిశతకమును నాయందుఁగల శిష్యవాత్సల్యముచేఁ జక్కగా సంస్కరించి దానిపై సదభిప్రాయమిచ్చి దిగంతవిశ్రాంతకీర్తి నార్జించి రమారమి 25 సం॥ నుండి జయప్రదముగ సాగుచున్న తమ యభినవసరస్వతీ పత్రికలోఁ బ్రచురించి నన్ను ధన్యునిగఁజేసినందులకు నా హృదయపూర్వకమగు సాష్టాంగవందనసహస్రంబులను త్రికాలములయందును శ్రీశాస్త్రిగారికి సమర్పణముచేయుచు నా కృతజ్ఞత నీరీతి వెల్లడించుచున్న నన్నును నాకవితాసంఘమును నుద్ధరించుచున్న శ్రీశాస్త్రిగారికిఁ బరమేశ్వరుఁడు సంపూర్ణాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి సంరక్షించుఁగాతమని ప్రార్థించుదును

ఇట్లు, విధేయుఁడు,

రామసుబ్బారాయఁడు, బి ఏ

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణే నమః

# జానకీపతిశతకము

— o —

ఉ శ్రీగలవానిఁ గాఁగ నను జేయుమటంచు నినుం భజింప ను
ద్యోగులయం బోకండనయి యుండుట చాలు భవాబ్ధి రేబవల్
నేఁగఁగనీక తావకపవిత్రపదంబులు గొల్చులాగునన్
వేగ ననుగ్రహింపుమని వేఁడెద నే నిఁక జానకీపతీ ! 1

చ సదయత నాకు నాంధ్రమునఁ జక్కని కైతము నేర్పి యెంతయున్
ముద మొనగూర్చియున్న పరిమూషితశిష్యజవాళిబాధునిన్
విదితసమస్తగాధుని వివేకసనాధుని రామనాధునిన్
వదలక కొల్తు నెల్లపుడు వాగ్విభవాప్తికి జానకీపతీ ! 2

ఉ ని మహనీయమూర్తి మది నిల్పినవాఁడయి నీదునామమే
బాములనెల్లఁ బాపునని భక్తిఁ దలిర్పఁగ సంస్మరించుచున్
నేమముతోడ నెల్లపుడు నిన్ను భజించెను నాదుతండ్రి ఆ
నామమె నాదుజిహ్వపయి నాట్యము సల్పుత జానకీపతీ ! 3

ఉ రామునిభక్తుఁడై పుడమి రాజిలె నాజనకుండు పేర్మి శ్రీ
రాముఁడె మత్కులంబునకుఁ బ్రాపనిపల్కెను బిన్నతండ్రియున్
రాముఁడె దైవమంచు మది రంజిల నిన్ను భజించుచుంటి నేన్
ప్రేమ మదీయవంశ మభివృద్ధికిఁ దెమ్మిఁక జానకీపతీ ! 4

చ రకమగు నీదునామ మలరన్ దగ నుంచెను నాదుపేరునన్
బ్రకటితభక్తిభావమున రాజిలు నా జనకుండు గాన నే
నొకనిముసంబుగూడ నిను నోపికఁ గొల్వక వ్యర్థపుచ్చ వే
ఱొకపని లేదు నాకు విను మోయిరఘూత్తమ ! జానకీపతీ ! 5

చ గణపతిఁగొల్చి యాపయినిగాని మఱొండు శుభప్రకాండముల్
గణన మొనర్ప రెవ్వరు జగమ్మునఁ గావున దంతిరాణ్ముఖున్

ప్రణతుఁ గొనర్చి కబ్బమును వ్రాయుటకై తగఁ బూనువాఁడ వా
క్ఫణితికినై సదా కొలుతు వత్సలతన్ గన జానకీపతీ! 6

ఉ. నా ప్రియశిష్యురాలు మఱి నాదగు పేరిట నీదుగాథఁ దా
నోపిక శ్రీసరస్వతి మృదూక్తుల నింపి రచించె శిష్యులై
నీపయి నూఱుపద్యములు నిల్పిరి కృష్ణకుమారమిత్రముల్
కాపరియంచు నేను శతకంబునఁ గొల్చెద జానకీపతీ! 7

ఉ. రాజలలామ మీవు కడురంజిలునట్లు కవీంద్రు లెందఱో
ఈజగతిన్ శతంబులు రచించినవా ర్శతకంబు లేను నే
యోజనొ నీపయిన్ శతక మొక్కటి వ్రాయఁగ సాహసించితిన్
తేజము నింపి యీకృతిని దీసికొనన్ వలె జానకీపతీ! 8

ఉ. ఎల్లరు భక్తిపూర్ణులయి యేభవదాకృతి దేవతాళి దా
ముల్లములందుఁ గన్గొనుచునుందురొ దేనిని సర్వరాట్టు చే
నోళ్ల నుతించుచుండునొ జనుల్ దగ దేని ననాదియందొ యా
త్వల్లలితాకృతిన్ మదిని దప్పకనిల్పుదు జానకీపతీ! 9

ఉ. పాలసముద్రపు న్నడుమఁ బన్నగతల్పముమీఁద సీటుగాఁ
బాళిఁ బిసాళినవ్వు చెలువంబు ముఖంబునఁ జెంగలింపఁగా
శ్రీలలితాంగిదైన నను చెక్కిలి గొక్కుచు వీడ్యమిచ్చుచున్
మేలములాడు నిన్ దలఁతు మించినవేడ్కను జానకీపతీ! 10

ఉ. భూమి జలంబు మారుతము పుష్కర మగ్ని సమస్తలోకముల్
సోముఁడు సూర్యుఁడు న్మఱియు సూక్ష్మములైన చరాచరంబులున్
నిమహిమన్ జనింపనయి నీవయి సర్వము నిండియుండఁగా
వేమఱు నిన్నుఁగానకిటు విస్మృతిఁజెందితి జానకీపతీ! 11

చ. గజవరదాతవైతి వొకకాంతకు వల్వలొసంగి మానమున్
సుజనులు మెచ్చఁ గాచితివి సోకులరాయని ముద్దుబాలుఁ డ
య్యజగరవహ్నివారిగరళాదుల మ్రందకయుండఁ జేసి తీ
రుజము హరించి సౌఖ్య మిడు రూఢిగ నాకును జానకీపతీ! 12

చ కులమును గీర్తిని పదవుఁ గూర్మియు దాల్మియు సత్ప్రవృత్తియున్
బల మనురాగమున్ సుఖ మపారపుభక్తియు భోగభాగ్యముల్
తఱుఁగని ధర్మచింతయు నుదారగుణంబును మానవాళి కి
య్యఁగ దయసేయు నీపదము నే స్మరియింతును జానకీపతీ! 13

ఉ నాపనఁ జేసితిన్ గవనసాహసము కొల్లపురమ్మునందు నే
ఈ ప్రకటంపుసంఘమున కై పనుబాధముగం జెలంగున
స్లిప్పువహించు ' రెడ్ లెటరు ' నింపుగఁ గూర్చితి మాసపత్రికన్
నిపటుశక్తి ముందునకు నెట్టఁగ నా నిఁక జానకీపతీ! 14

ఉ ఎప్పుడు మేలుకాంచి హృదయేశ్వరి సీతనుగూడి లీలలం
దొప్పుగఁ దేలుచుందువో మృదూక్తుల నాపెను దన్ని యప్పుడే
త్రిప్పుమ నీకటాక్షనియతిన్ నను మక్కువ నుద్ధరింపఁగాఁ
జెప్పెడి దేమి నీకు సరసీరుహలోచన! జానకీపతీ! 15

ఉ పంబినవేడ్క నిన్ గొలుచు భక్తజనంబులలోఁ బ్రధానుఁడన్
డంబములేనివాఁడను బడాయివహించెను వాఁడఁగాను అ
ర్థంబునుగోరి నిన్ గొలుచు దాసుఁడఁగాను భవత్కృపాపదా
ర్థం బొకటున్నఁ జాలు సతతంబును నాకది జానకీపతీ! 16

చ శరణని నిన్నుఁ జేరితిని సారెకుసారెకు భక్తిమై నమ
స్కరణము నీపదాంబుజయుగంబునకుం దగ సల్పుచుంటి మేల్
వరమునొసంగి నన్నుఁ బరిపాలనఁ జేయక తప్పదింకఁ జె
చ్చెర నరుదెంచి నాకు దయసేయవె మోక్షము జానకీపతీ! 17

ఉ దాసులు చేయుతప్పులను దప్పక త్రోయుట నీకు ధర్మమా
వీసము లోటు సూప కిటు విశ్రుతభక్తిని గొల్చుచున్న నీ
దాసుఁడ నేను మూఢుఁడ నిత పర మేమియు నే నెఱుంగ నా
దోసములన్ సహించి పరితోషితుఁ జేయవె జానకీపతీ! 18

ఉ పొంగినవేడ్క నీదు పదముల్ దగఁ బట్టితి మూఁడువేళలన్
వాఁగి నమస్కృతుల్ వినయవంతుఁడనై పచరించుచుంటి త

న్వాంగినిగూడి యాత్మను సమర్పణసేయుచునుంటి సత్కృపన్
మంగళముల్ లభించునటు మాకు ఘటింపుము జానకీపతీ! 19

ఉ. పాలనసేయువాఁడవని వారక నిన్నిదఁ గొల్చుచుంటి- నే
వేళను నీపదాబ్జములు పేర్మిని గన్నుల నద్దికొంచు నేఁ
గాలము నెట్టుచుంటిని సుఖంబును గాంచుచునున్నవాఁడ ని
న్నో విభజించువారి కిఁక నుండునె లోపము జానకీపతీ! 20

ఉ. నీప్రతిరూపమున్ నిలిపి నిచ్చలు మ్రొక్కనివారు లేరు నీ
సుప్రథితంబులౌ కృతులఁ జూడనివారును లేరు లేరు నీ
వప్రతిమానయోగమహిమాఢ్యుఁడ వాదిగురుండ వెంచఁగా
నీప్రతిభన్ నుతించుటకు నేరఁడెవండును జానకీపతీ! 21

ఉ. హెచ్చినభక్తిఁ జందురనకు నెల్లరు నీయరె నూలిపోగు? అ
ట్లచ్చపుబత్తి నుత్పలము లర్పణసేయుదు చంపకమ్ములన్
జెచ్చెర నీపదాబ్జములఁ జేరిచి సారె నమస్కరింతు నన్
మచ్చికతోడఁ గావఁగదె మాట లిఁకేటికి జానకీపతీ! 22

ఉ. తావకమైన రూపమును దైవతముల్ నుతియింపలేరు నీ
పావననామ మీశుఁడును బ్రస్తుతిసల్పఁగఁజాలఁ డట్టిలో
సేవకుఁ డట్టినిన్ను స్తుతిసేయఁగలాఁడిఁక? అట్టులౌన న
న్నీవె కృతార్థుఁజేయవలె నెట్టులొ గట్టిగ జానకీపతీ! 23

ఉ. రాతిని నాతిఁజేసితివి రాజశిరస్కుని విల్లు త్రుంచి తే
జోతతులౌ వచ్చి సాయపడఁ గూడఁగఁద్రోసితి రావణాసురున్
ఖ్యాతి గడించినాఁడవు సుఖాన విభీషణు రాజుఁజేసి ఆ
సీత నయోధ్యకున్ మరలఁ జేర్చితి పేర్చితి జానకీపతీ! 24

ఉ. నేర్వఁగలేదు శాస్త్రములు నేర్పునఁ జేయఁగలేదు దానముల్
నేర్వఁగలేదు వేదములు నేనెఱుఁగన్ గవితారహస్యముల్
నేర్వఁగలేదు సత్కృతులు నిచ్చలుఁ జేసెడుశక్తి లేదిఁకీ
సర్వము నీవె కూర్తువని సన్నుతి సల్పెద జానకీపతీ! 25

ఉ. కోరికలేము న పదవులు గూర్చుటకై మమతాను భోగముల్
నారికిఁ బ్రీతిమాటలను సల్పఁ బ్రయత్నము సేన వస్తుసం
భారము మీఁదికోరికెయు మానెను త్వత్పదభక్తి యొక్కటే
కోరుచునున్నవాఁడ సమకూర్పుము నా కది జానకీపతీ 26

ఉ. కాలము చేరువైన నను జ్ఞప్తికి ఎత్తువొ రావొ యప్పుడా
కాలునిపల్లెచె నలుఁగఁగా మదిఁ దోఁపదు నిన్ భజింపఁగాఁ
బాలన సేయుమయ్య నను బావన తావక పద్యుగంబుపై
వ్రాలి నమస్కరించెదఁ బరాత్పర! రాఘవ! జానకీపతీ! 27

ఉ. నీదగు నామ మెప్పుడును నిష్ఠమెయిన్ జపియించుచుండు స
మ్మోదము తోడ నీకరుణ పూర్తిగ నాపయి నుంచఁజాలు బ్రి
హగపరిరీతిఁ జిత్తము త్వదంఘ్రి సమర్పణసేసె యొంతయున్
నీదయఁ గాంచువారలకు నేరములుండునె జానకీపతీ! 28

ఉ. నీవ జపాగ్నిహోత్రములు నీవ పవిత్రములైన తీర్థముల్
నీవ యశేషపూజలును నీవ ప్రశస్తక్రియాఫలంబులున్
నీవ మహానుభావుఁడవు నీవ సమస్తమటంచుఁ గొల్తు నీ
పావనపాదపద్మములు పాలనసేయుము జానకీపతీ! 29

ఉ. ఉల్లముఁ దావకీనపదయుగ్మమునందునఁ జేర్చినాఁడ సం
ధిల్లినభక్తితోడ వెనుదీయక నాపయిఁ బ్రేమఁజూపి రం
జిల్లఁగఁ జేయుమీ మనసు చేకురఁ జేయుమి సర్వసౌఖ్యముల్
సల్లలితద్యుతుల్ పఱపి చక్కఁగఁ గావుము జానకీపతీ! 30

ఉ. స్నానము సంధ్యయున్ జపము సత్తపముం ద్యజియించినాఁడ నా
మానసమందు నేప్రతిమ మాత్రము నిల్పి భజించుచుండుటల్
మానఁ ద్వదేకభక్తి క్షణమాత్రము మానుట లేదు నీపద
ధ్యానము సేయుటల్ నిజము తప్పదు సుమ్మిది జానకీపతీ! 31

చ. తనువు స్థిరంబుగాదనెడు తత్త్వ మెఱింగియు భోగభాగ్యముల్
ధనములు బుద్బుదంబులని తథ్యముగాఁ దలపోయుచుండియున్

మనుజు లదేటికో విడువమానరు పాపపుంజ తమూఘులై
కనుఁగవఁగప్పఁబోకు మిటు గాఢతమం బున జానకీపతీ! 32

ఉ. మానవు లేమిచేసినను మానితమైన భవత్పదాంబుజ
ధ్యానము లేమిచేఁ గలుగునా! తగుమోక్షపదంబు మానులై
తా నలకేగిరే సుగతిఁ గాంచఁగఁజాలరు నీదుసత్కృపన్
మానుగఁ గాచనప్పుడు సమస్తము వ్యర్థము జానకీపతీ! 33

ఉ. నీమహనీయనామమును నిత్యము నెంచును సర్వలోకముల్
నీమహనీయపాదము నిచ్చలుగొల్తురు బ్రహ్మముఖ్యులున్
నీమహిమంబు నెన్నుటకు నేర్తురుగా కవిసార్వభౌములున్
నామది నెసమస్తను నాటుము శీఘ్రము జానకీపతీ! 34

ఉ. రామ గుణాభిరామ రఘురామయటంచు వచించినంతనే
కామితమొందఁదీగును సుఖంబును జేకురు నెల్లవేళలన్
నిమ్మతోడఁ గొల్చునెడ విరయిపోవును బాపసంఘముల్
నీమహిమం బునెన్నుటకు నేర్తురె యేరును జానకీపతీ! 35

ఉ. తారకమంత్రమెప్పుడును దారు జపింతురు మహేంద్రముఖ్యులున్
తారకమంత్రరాజజపతత్పరులే సుఖమొందువారలే
సారము లేని సంసరణసాగర మల్లన నీదు నేను నీ
తారకమంత్రమున్ జపము సల్పెదఁ దప్పక జానకీపతీ! 36

ఉ. అజ్ఞుఁడనంచుఁ ద్రోయ రయమ్మున నొద్దకుఁ జేరఁదీసి నన్
విజ్ఞునిగాఁగఁజేయుమిఁక వీడను బట్టిన నీపదమ్ము స
ర్వజ్ఞుఁడునుం ద్విదాజ్ఞను శిరంబునఁ దాల్చుచునుండుఁగాన నే
ప్రాజ్ఞుఁడవంచు వ్రాలితి భవత్పదమందున జానకీపతీ! 37

ఉ. భాగ్యములబ్బు నీ చరణపద్మము గొల్చినవారికెల్ల ఆ
యోగ్యత నాకుఁ గూడ నెటులో సమకూర్పుము దాన నాకు సౌ
భాగ్యము గల్గు సౌఖ్యమును బ్రాప్తమగుం దుద కేను శుద్ధవై
రాగ్యముఁబూని నీదరికి రాఁగలవాఁడను జానకీపతీ! 38

ఉ. భక్తుఁడ నీకు నేను మఱి పావనతావక నామమంత్రముల్
భక్తిదలిర్ప నిచ్చలును భావమునందలపోయుచుంటి నా
శక్తికొలందిఁ బద్యములుసల్పి త్వదీయయశంబు ధారుణిన్
వ్యక్తము సేయుచుంటి రవివంశసముద్భవ! జానకీపతీ! 39

ఉ. నన్ను గణించి నీకరుణ నాపయి జిల్కుచు నెల్లవేళలన్
దిన్నని వాగ్విలాసములుఁ దెల్వియు శక్తియు నిచ్చి ప్రోవవే
చెన్నలరార సౌఖ్యమును జెచ్చెరనిచ్చి యనుగ్రహింపవే
క్రన్నన జేరఁదీయవె వికాసముఁగూర్పవె జానకీపతీ! 40

ఉ. వ్యర్థుఁ డీఁకేమి సేయఁగలవాఁ డితఁడంచుఁ ద్యజింపఁబోకు మే
ర్థముఁగోరి ఎన్ గొలువనైతి భవత్పదపద్మ మొక్కెడే
ప్రార్థనసేయుచుంటి వినయంబున నా మనవిన్ గ్రహింపుమో
వార్ధికృతస్తుతీ! విబుధవర్య్యతమాకృతి! జానకీపతీ! 41

ఉ. తన్వినిఁ గూడి నిచ్చలును ధర్మముఁదప్పక నీపదాబ్జమే
నన్వితలందు ముంపక ఘనంబుగ నేలునటంచుఁ గొల్తు మే
నన్వికసిల్లు తేజముఁ గనం ద్వదనుగ్రహమంచుఁదోఁచె ఏ
నన్వవియింపు ప్రోతునని నమ్మికగల్గఁగ జానకీపతీ! 42

ఉ. నమ్మితి నీపదాబ్జములు నన్ దరియింపఁగఁజేయునంచెదన్
నమ్మితి నీస్వరూపమును నాయెడఁ జాలఁ బ్రసన్నమైనటుల్
నమ్మితి నీపరాక్రమము నాకలుషంబులఁ గూల్చునం చిటుల్
నమ్మి భజించెదన్ ద్రికరణంబులచే నిను జానకీపతీ! 43

ఉ. నిక్కము సెప్పుచుంటి మది నేను ద్వదాకృతి సంస్మరించుటే
తక్క నితఃపరంబెఱుఁగఁ దావకపాదముతక్క నన్యముల్
దిక్కని నమ్మలే దెపుడు దీనుఁడఁగావున నాదోసంగు స
మ్యక్కృపతో క్షమింపఁదగదా? పెఱవాఁడన? జానకీపతీ! 44

ఉ. నే మొఱవెట్టుచుంటినని నేస్తమునం జనుదెంచి వేగ బి
ట్టో మదువారు లేరు, గద! యూఱక యిట్లు తపించుచుంటి నా

బాములు పాపరాదనుచుఁ బాపుఁడఁగంచును ద్రోసిపుచ్చుటల్
నీమరియాదకుఁ దగదు నిక్కము సెప్పితి జానకీపతీ ! 45

ఉ వేదములు నీవె విష్ణువని విజ్ఞులు పల్కఁగ వింటిఁ గాన నా
నీమహనీయరూపమును నేను మనంబున నిల్పి నిచ్చలున్
నేమముతోడఁ గొల్చెదను నన్ను స్వదాసులలోనఁ జేర్చి వ
న్నో మింట కీకొనఁగవలయు నుద్ధృతిమీరుతి ! జా కీ తీ ! 46

ఉ నెన్ను నాకు సాటముగఁ గష్టములెన్నియొ వచ్చిపోవఁగన్
గన్గొతి నన్ను నెత్తయును నమ్మినభక్తుఁ డితండటంచు నన్
గన్గొను నాకు నెదు పదకంజముఁ గొల్చెదునట్టిభాగ్యమున్
గన్గవె నీకృపాగుణ గన్గినఁ గల్గును జానకీపతీ ! 47

ఉ తారకమంత్రరాజజపతత్పరతన్ మన నా నిరీహనా
నారదముఖ్యదివ్యమునినాథులకైన వశంబుగా దిఁకే
కోరికలో సదా మదిని గోరి చరించెడి యస్మదాదిలా
ఆరయఁ దారకింబునకు నర్హతముల్ క్షితి జానకీపతీ ! 48

ఉ అక్కటికమ్ముతోడ నభయమ్మొసఁగెద వీవటంచు నీ
దిక్కున కేఁగుదెంచితిని దీనతఁ బట్టితి నీపదద్వయం
బెక్కుడుభక్తితోడ భజయించుచునుండితి అల్లుగానఁ బెం
పెక్కఁగఁ జేయుభారము వహింపుము నీవిఁక జానకీపతీ ! 49

చ సుఖకర తావకీనపరిశుద్ధశరీరసుసంగమంబుచే
నఖిలపతివ్రతాజనమునందుఁ బ్రధానతఁగాంచి యుండెఁబో
నిఖిలజగత్ప్రు మేలనఁగ నీసతి సీతయు యుష్మదీయస
మ్ముఖకృతవాసముం దనరఁ బుణ్యతమంబగు జానకీపతీ ! 50

ఉ ఆశ్రమవాసులైన మునులందఱు నీచరణద్వయార్చనన్
విశ్రములై యనంతరము విశ్రుతమాగతి నొంది యున్నవా
రాశ్రితపక్షపాతివని చూసవహించి త్వదర్చనాత్మకం
బాశ్రమ మేనునుం బహుదు అల్లె మొనర్పుము జానకీపతీ ! 51

చ చెలువుగ భద్రపీఠమున సీతను గూడి విలాసలోలతన్
గలకల నవ్వుగొంచు రహిఁ గన్పడుచుందువు భక్తకోటికా
వలసితమేల్వదాకృతిని బ్రేమదలిర్పఁగఁ జూపరాదొకో
కలనయినం గృపామతిని గన్పడరాదొకొ ? జానకీపతీ ! 52

ఉ నీ కరుణాసుధారసము నీరజశత్రుఁడు నీరజాప్తుఁడున్
బ్రాకటభక్తిఁ గొల్చుదు రనారతమున్ మునికోటు లెప్పుడున్
వాకొనుచుంద్రు నీమహిమ వాకిటనుండుచు నిన్ను దేవతా
నీకము గొల్చు- పుణ్యమన నిక్కము వారిదె జానకీపతీ ! 53

ఉ నీకు సమానులై యెవరు నిల్వరు నీసరిదైవతంబు ము
ల్లోకములందుఁ గాన మదిలో నినుఁ గొల్చి కవిత్వకల్పనో
ద్రేకముచేత నీకయి నేఁటి రచియించితి నూఱుపద్యముల్
నాకృతిఁ గొంచుఁ జేయుమిఁక నన్ గృతకృత్యుని జానకీపతీ ! 54

చ వనరుహసంభవాదులును వర్ణనసేయఁగ లేరు నిన్ను ఏ
మని యిఁక నేను జేయఁగలనైనను సాహసమూని యెట్టులో
నిను నుతియింపఁబూనితిని నేర్చినరీతి దోసంగులుండినన్
కనికరముంచి యేరికిని గన్పడనీయకు జానకీపతీ ! 55

ఉ ఆదికి నాదియైన పరమాత్మవు నీవని నిశ్చయించితిన్
నాదుమనమ్ములోపల ఘనమ్మగు భక్తి నిగుడ్పఁజేసి నే
నీదయఁగాంచుకోర్కెమెయి నిన్నునయమ్మును గొల్చుచుంటి నా
మీఁద భవత్కృపారసము మిక్కిలిచిల్కుము జానకీపతీ ! 56

చ అతులితమౌ తపంబు లొనియాడఁగ జేయు మునీశ్వరాదు ల
ద్భుతమగు నీప్రభావమును బూర్తిగ వాకొనలేకయుండ దు
ష్కృతమతినైననాకు నెటు చేకుఱు నిన్ను నుతించుభాగ్య ? మీ
శతకము వ్రాయమాత్రమెటొ సాహసమూనితి జానకీపతీ ! 57

ఉ పొందవు మఖజాలములు పొందుగ నీ చరణద్వయమ్మునన్
డెందమునందు నిల్పికొని యిష్టమెయిన్ దగుపూజ సేయుచో
నెందును బొందఁజాలవుచు మీభయరోగము లెప్పుడైన గో
విందుఁడవైన నిన్ విడిచిపెట్టినవారికి జానకీపతీ! 58

చ తపము లొనర్చినన్ దగిన దానములన్ దుదముట్టఁజేసినన్
జపములు వ్రతాల్ సలిపినన్ నినుఁ గాంచఁగ వేరు నిక్క మ
చ్చపుఁ బదభక్తిచే సులభసాధ్యము నిదిగాదె బుఁ బెరుటల్
కృపఁ గనఁగ నెమ్మి గొల్తు నినుఁ గేవలభక్తిని జానకీపతీ! 59

చ నిరుపమమంగళాకృతిని నేర్పునఁ దాలిచి భార్యతోడుతన్
సరసములాడుకొంచు మను సత్సమయంబున నీముఖంబునన్
గరిమ స్రవించు నారసము నాపయిఁ జల్కు విను సమానఁగన్
వరద! మహానుభావ! యినవంశవివర్ధన! జానకీపతీ! 60

ఉ వర్ధితకీర్తివంచు ననవద్యచరిత్రుఁడవంచు నెంతయున్
సార్థకనాముఁడంచు మతి సత్యముఁ దప్పనివాఁడవంచు నిన్
బ్రార్థనసేయుచుంటి నిటు బాగుగ నాపయిఁ బ్రేమముంచి యి
ష్టార్థములెల్లనిచ్చి చరితార్థునిఁ జేయుము జానకీపతీ! 61

ఉ నిర్జరులైన వచ్చి రహి నీయెదుటన్ నిలువంగలారె? వి
స్ఫూర్జితమూర్తి నిన్ శరణుఁబొందినవారికి లోటు గల్గదే
దుర్జనుఁడున్ భవచ్చరణతోయజమంటి తరించుఁగాన నన్
వర్జనసేయఁబోకు పదపద్మములంటితి జానకీపతీ! 62

ఉ దుర్గతిఁగాంతునన్ వనటఁ దోఁచ దొకించుకయున్ మనంబులో
దుర్గమఘోరసంసరణతోయధి మున్గుచునున్నవాఁడ దు
ర్మార్గమునందుఁ జిక్కుకొని మంతులఁ జేయుచునున్నవాఁడ నీ
వర్గమునందుఁ జేర్చుకొని పాలనసేయవె జానకీపతీ! 63

చ స్థిరమయియుండ దెప్పటికిఁ జిత్త మిఁకేమనివిన్నవింతు వా
మరుఁడను నేనువట్టి మతిమాలినవాఁడను నైననేమి ? నీ
చరణయుగంబునంబడితి సత్కృప లేవఁగఁదీసి కావ కె
ట్లిటులెటిటోడ నివు నను నావలఁద్రోసెదు ? జానకపతీ ! 64

ఉ విశ్రమమింత లేక నిను వేమరుఁ గొల్చుచునున్నవాఁడ నీ
యాశ్రయమందుఁ జేరి యెటులైనఁ దరింపఁగనున్నవాఁడ నా
యాశ్రమమెల్ల నేటికిటు లెంతయు వ్యర్థముసేయఁజూచె ? దీ
నాశ్రితరక్షకుండవుగదా ? ఇన నీక్షితి జానకీపతీ ! 65

ఉ ఆశయమ తయుండినను నంతయు వ్యర్థమగుఁ భవత్కృపా
వేశము లేకయున్న బహునే ? నిజభక్తునిఁ బ్రోచుటన్న, నీ
వే శరణంచు మ్రొక్కెద నిశ్చెద నివ మదీయదైవతం
బీశ ! రమే ! ఓ జగదధీశ ! శుభేక్షణ ! జానకీపతీ ! 66

ఉ బంధుర లాప్తులున్ సుతులుఁ బ్రాణము లుండినయంతదాఁక సం
బంధము గల్గఁజేసికొని బాగుగ డగ్గఱఁజేరుచుందు రా
బంధమునుండి యించుకయుఁ బ్రాప్తముకాదు ఫలంబు గాన నే
బంధములేని నీపద మవశ్యముఁజేర్పుము జానకీపతీ ! 67

చ బుడగవలెన్ నశించు వరభోగములన్ మదిఁ గాంక్షసేయ నే
నెడుగున కాస్పదంబయిన ప్రిని గ రింగ పూతింప నెంతయున్
గడు వినయంబెసంగఁ గలకాలము నిన్ను భజించుచుందు నీ
యడుగులనాశ్రయింతును మహాత్మ ! ప్రభానిధి ! జానకీపతీ !

ఉ ఎన్నటికైన నీదుకృపకే మది నెంతయుఁ గాంక్షసేతు నే
నెన్నటికైన నీసుగుణమే బహుళంబుగ సన్నుతింతు నే
నెన్నటికైన నీదుపదమే పరమంబని భక్తిఁ గొల్తు నే
నెన్నటికైన నిన్ విడువకే భజియింతును జానకీపతీ ! 69

ఉ నీ కరుణాకటాక్ష మెవనిం గను ధన్యునిఁజేయు వాఁడెపో
శ్రీకి నివాసభూతుఁడయి చిక్కనికీర్తి సంతరించి బ
ప్టేకవిధంబునన్ వెలుఁగు నిందును నందును గాన నాపయిన్
నీ కరుణాకటాక్షమును నిల్పి కనుంగొను జానకీపతీ! 70

ఉ ధీమతియైన పెండ్లమును ధీరుని దమ్ముని గూడి కానన
స్తోమమునం జరించి హతదుష్టత నందు వసించు సంయమి
గ్రామము నోముచున్ భువనకంటకు రావణుఁ గూల్చి యంతటన్
క్షేమముగూర్పఁ గోర్కెఁ గృతసృష్టిలయస్థితి! జానకీపతీ! 71

చ తనయులపైని భార్యపయిఁ దద్దయు బ్రేమ యుండుట సాజ మె
వ్వనికిని భేదముండదిల స్వామికి భర్తున కట్లుగాన నా
తనయులు భార్యయుం దలఁపఁ దావకులే కద! ఇంక వారికిన్
దనరెడు భాగ్య మిచ్చి సతతంబును బ్రోవుము జానకీపతీ! 72

చ తనయులు చిన్నవారు విదితంబుగ దా సతి చిన్నదాఁచు! ఎ
డను మది నెంచిచూచినఁ గడుంగడుఁ దక్కువ నాకుఁగూడ ఇ
ట్లని ముఖచిహ్నముల్ గనినయంతనె సత్యము విప్పిచెప్ప నే
యనువునఁ బ్రోచెదో ? సుఖములందఁగఁజేయుచు జానకీపతీ! 73

ఉ ప్రాణముపోవువేళ నిజబంధులు పుత్రులు పెండ్లి మాప్తులన్
గోణముగూడఁ దీసికొని కూర్రత వీడి గమింతురి తద్దయున్
రాణఁ జెలంగునప్పుడెదురన్ వసియింతురిటుగాక నివు నా
ప్రాణము పోవునప్పుడయినన్ ద్యజియింపకు జానకీపతీ! 74

ఉ ధర్మ మధర్మమున్ సువిదితంబయి యుంకుటఁజేసి నేను స
త్కర్మములాచరించుచును దప్పక కల్గును మోక్షమంచు నా
నిర్మలమానసంబున వినీతుఁడనై నినుఁ గొల్చుచుంటి నే
కర్మమెఱుంగఁజూవె యిదిగాక రమాపతి! జానకీపతీ! 75

ఉ ప్రకటతావకీనపదపంకజయుగ్మమునందు భక్తి శో
భాకరమైన నీదు మృదులాంగము లెప్పుడు మానసంబునన్
వీఁ వసింపఁజేయుటయు నేను భువిన్ మనునంతకాలమున్
నాకు ననుగ్రహించుటకు నమ్రతఁ గొల్చెద జానకీపతీ! 76

ఉ నీమృదుపాదపద్మముల నిశ్చలభక్తిని శ్రేయమిచ్చు త్వ
న్నామజపంబు భూమిపయి నాఁటిన మేటి వనాటపుంగవున్
ఏ మహనీయకార్యమును నేమమునం బొనరించు మారుతిన్
ధీమహితాత్మునిన్ గొలుతుఁ దీరనిభక్తిని జానకీపతీ! 77

ఉ మేటిబలంబునం గడలిమీఁదుగ లంకకుఁ జేరఁబోయి య
ప్పోట భవన్నిమిత్తముగ వేదనఁ జెందుచునున్న సీతయా
రాటము మాన్పి యాపె కుశలంబును నీ కవలీలఁ జెప్పఁడే
నిటుగ నాంజనేయుఁ డతనిన్ భజయించెద జానకీపతీ! 78

చ పరమపతివ్రతాత్వమునఁ బ్రాయము కొంత క్రమించి భర్తని
ర్జరపుర మేలఁ గొల్ల పురరాజ్యము దానును నేలుచుం బ్రజా
దరణము పైనభక్తియును దద్దగడించిన రత్నమాంబ శ్రీ
కరముగ నాయురున్నతులఁ గాంచఁగఁజేయుము జానకీపతీ! 79

ఉ ఆ జగదీశ్వరుండు కరుణాళువు సద్గుణసాగరుండు వి
భ్రాజితవైభవోన్నతుఁడు భాగ్య మభాగ్యము వ్రాయు బ్రహ్మ తా
నా జతినానఁ దోడుపడి నన్ గృతకృత్యుని జేయుపొంటె నే
నోజ భజించువాఁడ మహిమోజ్వలు నాతని జానకీపతీ! 80

చ చిరునగ వంకురింప సరసీరుహము ల్నగు నీదుపాదముల్
కరముల నొత్తుచున్ మిగుల గారవమొప్ప భజించు సీతమన్
కర మనురక్తితోడ బిగికౌఁగిటఁ జేర్చి సుఖించునీవు న
న్నఱమఱలేక ప్రోవవలె నార్య! రఘూత్తమ! జానకీపతీ! 81

ఉ దైవముపైన భారమిడి తజ్ఞులు సెప్పెడిరీతి నేగుచున్
భావనచిత్తులై సమయవర్తనులై చరియించువారికిన్
శ్రీ విలసిల్లునంచు విని శ్రేష్ఠపుదైవమవైనని న్నాదరన్
భావన చేయుచుంటి విడి భారము నీపయి జానకీపతీ 82

ఉ తప్పులు చేసినాఁడనని త్వత్పదపద్మములంటి చెప్పుచున్
దప్పక యొప్పుకొంటిఁగద! దండముతోసరి దాసుతప్పు లే
కప్పరపాటు లేక బ్రతుకన్ గలభాగ్యము జీవితంబునం
దెప్పటికైనఁ గూర్పవ! మహిన్ సుఖపెట్టవ? జానకీపతీ! 83

ఉ దృష్టిపథంబునం బడిన దేవ! విరోధులనైనఁ బిమ్మటన్
శిష్టులు చేరుతావునను జేర్చు దయాబ్ధివిగాన నీవు నా
దృష్టిపథంబునం బడి విధించు సపర్య గ్రహించి నన్ను సం
తుష్టుని జేయరావె హతదుర్జనతాతతి! జానకీపతీ! 84

ఉ మానమొకింత లేక యభిమానము పెల్లునఁ జేసి నేను గ
గ్నానక చేయఁగాఁదగని కార్యము లెన్నియొ చేసినాఁడ అ
వ్వానిని నేఁ క్షమింపుమిఁక వచ్చెను బుద్ధియు నీవు స్వాశ్రితా
ధీనుఁడ నాశ్రయించితి మదిన్ గృపఁబూనుము జానకీపతీ! 85

ఉ పాపము లెన్నియేని సులభంబుగఁ జేసితి నిప్పు డెక్కుడౌ
తాపముఁ జెందుచుంటి గతధైర్యుఁడనైతి దురంతమైన యీ
తాపము చేత నాదుమది తా ననయమ్మును దహ్యమాన మ
ప్పాపము రూపుమాపి ననుఁ బావనుఁ జేయుమ జానకీపతీ! 86

చ తెలియక కొన్నియున్ మఱియుఁ దెల్విని గాంచినవెన్కఁ గొన్నియున్
సలిపితి నేను పాపములు చాలనున్నవి యవ్వి యెన్నఁగన్
దెలిసియుఁ జేసినంతులకుఁ దీవ్రతరంబగు తత్కృతాంతశి
క్ష లనుభవింపకుండ నను సత్కృపఁజూడుము జానకీపతీ! 87

ఉ ఈ విధమైన కష్టముల నేనిలఁ గుడ్చుట యెంతకాలమో
భావమునం దెఱుంగఁగద! బల్భయమయ్యెడి నెంచిచూడ నా

కేవిషయంబుఁజూచినను నెంతయు రోఁతగఁ గానుపించు సు
శ్రీవిలసిల్లఁగాఁదగిన శ్రీయముఁ గూర్పుము జానకీపతీ! 88

చ పరధనముల్ హరించి పరభామలఁ గోరుచు ధర్మమార్గమున్
మఱచి ధరం జరించు మదమత్తునకున్ సమవర్తి యెట్టి దు
ర్భరమగుశిక్ష వేసెడినొ భ్రాంతత నాకది వేయనీక నీ
కరుణకుఁ బాత్రుఁ జేసికొను కాళుల వ్రాలితి జానకీపతీ! 89

చ ధరఁగల తీర్థకోటులకుఁ దానకమై విలసిల్లు నీపదాం
బురుహము లాశ్రయించితిని పూజయొనర్చితి నీకు సత్కృపన్
బొరసినఁగాని కాను గడుఁబుణ్యుఁడ నింక ననుగ్రహింపుమో
యరుణగభస్తిసంతతి మహాబ్ధినిశాపతి! జానకీపతీ! 90

చ కలతను బొందఁగాఁదగినకాలము నెప్డు ఘటింపఁబోకుమా
మెలఁకువతోడ నిన్నెపుడు మేదురభక్తి భజించుచుందు నా
నెలత కనామయంబొసఁగి నిచ్చలు నా యెడ లుడ్పి ప్రోవుమా
చలనములేని సౌఖ్యమును జక్కఁగఁ గూర్చుచు జానకీపతీ! 91

ఉ అన్నవ నీవు పూర్వభవమందున నోఁచిన నోము గాన నీ
కెన్నటికైన సౌఖ్యమువహించెడు భాగ్య మదెట్లుగల్గు నం
చెన్నఁగరానికష్టములు నెప్డు ఘటించుచు దుఃఖవార్ధిలో
నన్నిటుముంపఁ బాడియగునా? వచియింపుము జానకీపతీ! 92

వ అలసి శ్రమంబుతో నతిథి యాత్మగృహంబున కేగుదెంచినన్
కలిగినమాత్ర మన్న ముదకంబు నొసంగక సేదదీర్చ నా
ఇలు సొరనీక యేమిటికి నీడకు వచ్చితివంచుఁ గ్రూరతన్
చలమునఁ బల్కియుంటినొకొ నన్గరుణింపవు జానకీపతీ! 93

ఉ స్రుక్కుచునుంటి కంఠమును శోషిలె ధైర్యములేదు నెమ్మదిన్
బొక్కుచునుంటి దీనుఁడను పోష్యపువర్గములోనివాఁడ నా
చిక్కులుదీర్చి హర్షమును జెందఁగఁజేసి యనుగ్రహించి నీ
ప్రక్కకుఁ జేర్పరాదె? యనురాగము మీఱఁగ జానకీపతీ! 94

కేవిషయంబుఁ జూచినను నెంతయు రోఁతగఁ గానుపించు సు
శ్రీవిలసిల్లఁగాఁదగిన శ్రేయముఁ గూర్పుము జానకీపతీ! 88

చ పరధనముల్ హరించి పరభామలఁ గోరుచు ధర్మమార్గముల్
మఱచి ధరం జరించు మదమత్తునకుల్ సమవర్తి యెట్టి దు
ర్భరమగుశిక్ష వేసెడినొ భ్రాంతత నాకది వేయనీక నీ
కరుణకుఁ బాత్రుఁ జేసికొను గాళుం వ్రాలితి జానకీపతీ! 89

చ ధరఁగల తీర్థకోటులకుఁ దానకమై విలసిల్లు నీపదాం
బురుహము లాశ్రయించితిని పూజయొనర్చితి నీకు సత్కృపల్
బొరసినఁగాని కాను గడుఁబుణ్యుఁడ నింక ననుగ్రహింపుమో
యరుణగభస్తిసంతతి మహాబ్ధినిశాపతి! జానకీపతీ! 90

చ కలతను బొందఁగాఁదగినకాలము నెప్డు ఘటింపఁబోకుమా
మెలఁకువతోడ నిన్నెపుడు మేదురభక్తి భజించుచుందు నా
నెలత కనామయంబొసఁగి నిచ్చలు నా యడ లుడ్పి ప్రోవుమా
చలనములేని సౌఖ్యమును జక్కఁగఁ గూర్చుచు జానకీపతీ! 91

ఉ అన్నవ నీవు పూర్వభవమందున నోఁచిన నోము గాన నీ
కెన్నటికైన సౌఖ్యమువహించెడు భాగ్య మదెట్లుగల్గు నం
చెన్నఁగ రానికష్టములు నెప్డు ఘటించుచు దుఃఖవార్ధిలో
నన్నిటుముంపఁ బాడియగునా? వచియింపుము జానకీపతీ! 92

వ అలసి శ్రమంబుతో నతిథి యాత్మగృహంబున కేగుదెంచినన్
కలిగినమాత్ర మన్న ముదకంబు నొసంగక సేదదీర్చి నా
ఇలు సొరనీక యేమిటికి నీడకు వచ్చితివంచుఁ గ్రూరతన్
చలమునఁ బల్కియుంటినొకొ నన్గరుణింపవు జానకీపతీ! 93

ఉ స్రుక్కుచునుంటి కంఠమును శోషిలె ధైర్యములేదు నెమ్మదిన్
బొక్కుచునుంటి దీనుఁడను బోష్యపువర్గములోనివాఁడ నా
చిక్కులుదీర్చి హర్షమును జెందఁగఁ జేసి యనుగ్రహించి నీ
ప్రక్కకుఁ జేర్పరాదె? యనురాగముమీఱఁగ జానకీపతీ! 94

చ మనమున శాంతిఁబూని నియమంబులు తప్పక తీర్చి యుష్ణదం
బ్రినళినయుగ్మముఁ గుఱచి కేవలభక్తి నమస్కరించి య
ర్చనలొనరించువారలను సాకినరీతిగ నన్ను సాకవం
చనయము వేడువాడను దయన్ ననుఁ బ్రోవుము జానకీపతీ ! 95

ఉ ఈ యఖిలప్రపంచమున కీవ విభుండవు వి యువాచ్యవ
మాయ నెఱుంగ నాతరమె ? మానుష వేషముదాల్చినట్టి నా
రాయణమూర్తివి వనుచరావళి గొల్వ ఖగేంద్రుని క్కి వి
చ్చేయుము దర్శనంవికుము స్వర్ధతిమాకృతి ! జానకపతీ ! 96

ఉ అవ్యయ మప్రితర్క్య మఖిలాశ్రియ మక్షయ మాద్య మార్యసం
సేవ్య మనం దనర్చు పరతత్త్వమ నీవయి సృష్టిసాధన
ద్రివ్యగుణాత్మకత్వమునఁ దాలుతు వేతమవైనఁ జూపు మ
ద్దివ్యశరీర మియ్యెడలఁ దిన్నగ నాకిఁక జానకీపతీ ! 97

ఉ ధర్మమునం బ్రజాహితము ధర్మమ మెత్తురు పేల్పు లార్యులున్
గూర్మివహింతు రర్థమును కూర్పక యే ల విపృద్ధిఁబొందు దు
ష్కర్మలు భీతిఁ జెందుదురు శత్రులడంగుజ దిష్టసిద్ధి నా
నిర్మలకీర్తియున్ ధరణి నిల్చుఁ దిరంబుగ జానకీపతీ ! 98

ఉ పాయనిభక్తి నీపయిని వ్రాసితి నీశతకంబు నేను సు
శ్రీయుత వాజపేయకులసింధుశశాంకసముండ రాముసు
బ్రాయుఁడ నీదుభక్తుఁడ విపన్నుఁడ దీనిని బ్రేమతోడుతన్
స్వీయవిభూషణంబుగను జేకొని తాల్చుము జానకీపతీ ! 99

చ జయజయ సాధురక్షణ ! విచారవిచక్షణ ! సారసేక్షణా !
జయజయ సర్వకారణ ! నిశాచరదారణకృన్మహారణా !
జయజయ సత్యభావన ! సుజన్యసుభావన ! లోకపావనా !
జయజయ మంజుభాషణ ! లసత్కులభూషణ ! జానకీపతీ ! 100

---

చంద్రికా ముద్రాక్షరశాల గుంటూరు